# మానవ విలాపము

కర్త:
మధురకవి
**పాలా వేంకటసుబ్బయ్య, M. L. A.**
కారదర్శి: కడపజిల్లా హరిజన సేవక్ సంఘము
కడప.

ప్రచురణ:
**ఆంధ్రప్రదేశ్ హరిజన సేవక్ సంఘము**
**విజయవాడ (బ్రాంచి)**

స్వామీ సీతారాం
అధ్యక్షులు :
ఆంధ్రప్రదేశ్ హరిజన సేవక్ సంఘము.

వినయాశ్రమం
22—5—59

మధురకవి శ్రీ పాలా వెంకటసుబ్బయ్యగారు రచించిన మానవ విలాపము అను గ్రంధమును కీ॥ శే॥ నేతి వెంకటా చలపతిగారికి కృతినిచ్చియున్నారు.

కీ॥ శే॥ చలపతిగారు హరిజనులను ప్రకటిత పరమాత్మ రూపులుగా నుద్దేశించి సేవచేసిరనుట ఆయనయొక్క అభి ప్రాయమును సరిగా వర్ణించుటయై యున్నది. హరిజన సేవచేసి అస్తంగతులైనవారు "మిన్నున దేదీప్యమానంగా వెలుగుచుండు వెన్నుని సమీపమున ప్రకాశింతురని" తెలుపుట సమంజసముగా నున్నది. ఇట్లు సాలోక్యమునకేగాక సారూప్యమునకు, సాయుజ్య మునకు వీరలు అర్హులని నేను ఎంచెదను.

ఎల్లకాలము స్మేరాననముతో అధోగతిపాలైయున్న జనుల నుద్ధరించుటకు పూనుకొనిన వెంకటాచలపతిగారి సంకల్పము మహోదారమైనది. సామాన్య లౌకిక రాజకీయ చదరంగములో పాల్గొనుటకు ఇచ్చగించక తన యపారమైన సేవా సామర్ధ్యము లను ఉత్తమోత్తమ పంథాలో వినియోగించెను.

ఈ కవిని మధురకవి యని పిలుచుట సంభావ్యముగా నున్నది. ఆయన గ్రంథములో యనేకచోట్ల నూతనమైన, లలితమైన పంథాలు, పోకడలు, భావములు, కన్పట్టుచున్నవి. కవిత్వ ధోరణి సరళముగానున్నది. ఈ గ్రంథమును, ఇందులోని పద్యములను బుర్రకథారూపమున ఎక్కువ వ్యాప్తిలోనికి తెచ్చుట అవసరము. ఇట్టి గ్రంథ రచన తమ యాజమాన్యమున జరిగినందులకు ఆంధ్రప్రదేశ్ హరిజన సేవక సంఘమున్నూ గర్వింపతగియున్నది. దీనికి అధ్యక్షుడనైన నేనున్నూ ఈ మధురకవిగారికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతను తెలుపుచున్నాను.

జై జగత్

(సం.) సీతారాం

8—10—11



# ముందుమాట

ఈ లఘుకావ్యము భారత ప్రజానీకము నందలి ఒక భాగమై- ఆదియాంధ్ర, అరుంధతీయ, మాల, మాదిగ, హరిజన ఇత్యాది నామములతో ఆర్థిక, సాంఘిక రంగములలో అట్టడుగునఁ బడి- బహు క్లేశములకు గుఱియైన వారి యాందోళనమును గుఱించి "మానవవిలాపము" ను పేర వ్రాయఁబడినది.

ఇయ్యది చాలాకాలము క్రిందట వ్రాయఁబడియు, పేటికాంతర్గతముగా నుండినది. మిత్రులు శ్రీ ఊటుకూరి నరసింహారావు (ఆంధ్రరాష్ట్ర హరిజన సేవా సంఘ కార్యదర్శి) గారి ప్రకాశన ప్రోత్సాహములతో నేటికి వెలువడినది. వారికి కడుంగడు కృతజ్ఞుఁడను.

ఆదరాభిమానములతో, ఈ కావ్యమును వెలువరించుటకు అనుమతి నొసఁగిన మహర్షులు శ్రీ స్వామి సీతారాం (ఆంధ్రరాష్ట్ర హరిజన సేవా సంఘాధ్యక్షులు) గారికి కృతజ్ఞతానేక నమస్కృతు లర్పించు చున్నాఁడను.

స్వర్గీయ నేతి వేంకటాచలపతిగారిని హరిజన సేవా సంఘ కార్యదర్శిగా నే నెఱుగుదును. వారు లలిత మనస్కులు- సంస్కార ప్రియులు- మృదుల వచోవిలాసముల నెదుటివారి నాకర్షింపఁగల సమర్థులు- నిరంతర హరిజన సేవాకార్య దురంధరులు. ఏతత్కార్య సంలగ్న చిత్తంబుననే వారు దివంగతులైరి. వారి యాత్మ శాంతి నాకాంక్షించి ఈ చిఱుకావ్యము వారి కంకిత మొసఁగుచున్నాఁడ.

ఇట్లు,

— కావ్యకర్త.



# అంకితము



శ్రీ నేతి కులాంబోధి క
లానిధి ! వేంకట చలపతి - లలిత మనస్వీ !
భూనభముల కీర్తి వెలయ
మానవులను మాన్యుఁడనఁగ - మని చనితిగదే.

చ॥ సకల చరాచరంబులను
జాగరితుండయి, మిక్కుటంబుగన్
వికలతఁగూలు పేదలను,
విన్నదనంబున క్రుందు మాలలన్
ప్రకటితమౌ మహేశ్వరుని
భావనజేసి నిరంతరంబు నీ
వొక యజనంబునందువలె
నుత్తమ సేవను జేసి తెంతయున్.

క॥ మన్నన కలిసితి వీవని
కన్నులు లేనట్టి వారు - కాఱులనంగన్
మిన్నున వెన్నుని దరికిన్
గ్రన్నన జని వెల్గుచుంటి - కాంతులతోడన్.

గీ॥ మాల వనమాల నాగ స - న్మానమంది,
వెలుఁగు వనమాలి కంఠాన ; - ప్రీతినతఁడు
మాల సేవలో మునిఁగిన - మాన్య నిన్ను
మహిత సింహాసనంబున - మనుపఁడేమి ?

సీ॥ చిఱునవ్వు పసలీన - చేఁజూపి నిను లోక
మాన్యుండు చీరెనే - మచ్చికమెయి,

చల్లని చూపుల - స్వాగతమిడి రామ
కృష్ణుండు పిలచెనే - ప్రియముతోడ

నీరాజనంబిచ్చి - నెనరున ఛక్కరు
బాబా వహించెనే - పరమ ముదము,

పూమాల నర్పించి - ముదము మీఱ నరేంద్రుఁ
డాహ్వాన మొసఁగెనే - యాసనమిడి,

పలుకు పలుకున వెన్నెలల్ - భాసిలంగ
పూజ్య బాపూజి యాడెనే - పుణ్యుఁడవని
అవును, జరుగ కుండునెయట్లు - హరిజనాళి
సేవ హృదయానగోరు వి - శిష్టులగుట.

ఆ॥ వె॥ భాగ్యరెడ్డి వర్మ - పట్టు బ్రహ్మరథము
కుసుమ ధర్మసుకవి - కూర్చు గీత,
అమల చరిత వ్రాయు - నంబేత్కరుఁడమరు
లెల్ల క్షేమటంచుఁ - డెల్లఁబోవ.

గీ॥ చంద్రునకు నూలుపోగను సరణి నాదు
కావ్య కన్యక నర్పింతు - కరము శాంతి
హృదయమందున బొంది శ్రీ - కృష్ణుచెంత
హాయిగా వసియించు ను - హానుభావ.

*　　*　　*　　*

# మానవ విలాపము

గీ॥ పారతంత్ర్య హానసయుద్ధ - వారినిధిని
పారమును ముట్ట నీదిన - పరమశక్తి
అంటు దోషమ్ము నడుగంట - గెంటుటందు
జీలు వడు టేమి సఖులార! మేలు కొనుడి.

ఉ॥ రమ్మనుచున్ స్వరాజ్య సమ
రమ్మున పాల్గొడఁగూర్చ నేడిటుల్
కిమ్మనకుండ శాసనము
క్రిందకుఁ ద్రోక్కియు నంటు దోషమున్
సమ్మతిపైఁ బ్రచారమును
సల్పుట ధర్మమే? భారతావనిన్
వమ్మనఁద్రోసి యంత్యజుల
బాధల కగ్గము సేయఁగూడు నే

గీ॥ శుభము దాకాంక్ష చేయుచో - సోదరులిల
కంకణంబును బూని నిష్కంప మాన
దీక్షఁ గొనియు నస్పృశ్యతా రాక్షసి నిలు
వెడల నంపుట దుస్తర వృత్తిగాదు.

గీ॥ మాల మాదిగలను పేర - మానవులను
నీచముగఁ జూడనెంచుట - నీతియగునె ?
దీన మానవ రక్షా ప్రతిజ్ఞఁగొన్న
దాశరథి దుర్విదగ్ధుల - దయను గనునె.

గీ॥ బ్రహ్మ ముఖమున బాహు గర్భ పదములను
వరుస జనియించినారు భూ - సురులు మొదలు
క్షత్రియులు వైశ్యులును శూద్ర - జాతు లవని
యనుచు మనువు లభించె సాహసము గాదె.

గీ॥ అగ్రజాతులవారు సవ్యంబు నగుచు
క్రింద తరగతి స్త్రీలను - బొందవచ్చు,
క్రిందువారలు పైవారి - పొందుగోరి
అధమ సంతానమును గాంతు రనియె నతఁడు.

గీ॥ శూద్రుకుల బ్రాహ్మణస్త్రీని - శుభము నెంచి
పెండ్లియాడిన చెల్లదు; పృధివి వారు
వర్ణ బాహ్యులు; వారికి ప్రభవమైన
సంతతియె పంచమ కులము - జగతియందు.

మ॥వృ॥ వారొక స్థలమున - నుండంగరాదు
దేశ సంచారంబు - లేఁకువఁ జెడియు
సేయుట ధర్మంబు - చిత్తంబు గలుగ
వసియింపనగు వెలివాడలయందు.

# మానవ విలాపము

గీ॥ పారతంత్ర్య మానవయుద్ధ - వారినిధిని
పారమును ముట్ట నీదిన - పరమశక్తి
అంటు దోషమ్ము నడుగంట - గెంటుటందు
జీలు వడుటేమి సఖులార! మేలు కొనుడి.

ఉ॥ రమ్మనుచున్ స్వరాజ్య సమ
రమ్మున పాల్గొనఁగూర్చి నేఁడిటుల్
కిమ్మనకుండ శాసనము
క్రిందకుఁ ద్రొక్కియు నంటు దోషమున్
సమ్మతిపైఁ బ్రచారమును
సల్పుట ధర్మమే? భారతావనిన్
వమ్మనఁ ద్రోసి యంత్యజుల
బాధల కగ్గము సేయఁగూడునే

గీ॥ శుభము నాకాంక్ష చేయుచో - సోదరులిల
కంకణంబును బూని నిష్కంప మాన
దీక్షఁ గొనియు నస్పృశ్యతా రాక్షసి నిలు
వెడల నంపుట దుస్తర వృత్తిగాదు.

గీ॥ మాల మాదిగలను పేర - మానవులను
నీచముగఁ జూడ నెంచుట - నీతియగునె ?
దీన మానవ రక్షా ప్రతిజ్ఞఁగొన్న
దాశరథి దుర్విదగ్ధుల - దయను గనునె.

గీ॥ బ్రహ్మ ముఖమున బాహు గర్భ పదములను
వరుస జనియించినారు భూ - సురులు మొదలు
క్షత్రియులు వైశ్యులును శూద్ర - జాతు లవని
యనుచు మనువు లభించె సాహసము గాదె.

గీ॥ అగ్రజాతులవారు సర్వంబు నగుచు
క్రింది తరగతి స్త్రీలను - బొందవచ్చు,
క్రిందివారలు పైవారి - పొందుగోరి
అధమ సంతానమును గాంతు రనియె నతఁడు.

గీ॥ శూద్రుశల బ్రాహ్మణస్త్రీని - శుభము నెంచి
పెండ్లియాడిన చెల్లదు; పృథివి వారు
వర్ణ బాహ్యులు; వారికి ప్రభవమైన
సంతతియె పంచమ కులము - జగతియందు.

మ॥వృ॥ వారొక్క స్థలమున - నుండంగరాదు
దేశ సంచారంబు - లేకుఁడవఁ జెడియు
సేయుట ధర్మంబు - చిత్తంబు గలుగ
వసియింపనగు వెలివాడలయందు.

# మానవ విలాపము

గీ॥ పారతంత్ర్య హననయుద్ధ - వారినిధిని
పారమును ముట్ట నీదిన - పరమశక్తి
అంటు దోషమ్ము నడుగంట - గెంటుటందు
జీలు వడు టేమి సఖులార! మేలు కొనుడి.

ఉ॥ రమ్మనుచున్ స్వరాజ్య సమ
రమ్మున పాలొడఁగూర్చి నేడిటుల్
కిమ్మనకుండ శాసనము
క్రిందకుఁ ద్రొక్కియు నంటు దోషముని
సమ్మతిపైఁ బ్రచారమును
సల్పుట ధర్మమే? భారతావనిన్
వమ్మనఁద్రోసి యంత్యజుల
బాధల కగ్గము సేయఁగూడు నే

గీ॥ శుభము దాకాంక్ష చేయుచో - సోదరులిల
కంకణంబును బూని నిష్కంప మాన
దీక్షఁ గొనియు నస్పృశ్యతా రాక్షసి నిలు
వెడల నంపుట దుస్తర వృత్తిగాదు.

గీ॥ మాల మాదిగలను పేర - మానవులను
నీచముగఁ జూడ నెంచుట - నీతియగునె ?
దీన మానవ రక్షా ప్రతిజ్ఞఁ గొన్న
దాశరధి దుర్విదగ్ధుల - దయను గనునె.

గీ॥ బ్రహ్మ ముఖమున బాహు గర్భ పదములను
వరుస జనియించినారు భూ - సురులు మొదలు
క్షత్రియులు వైశ్యులును శూద్ర - జాతు లవని
యనుచు మనువు లభించె సాహసము గాదె.

గీ॥ అగ్రజాతులవారు సవ్యంబు నగుచు
క్రింది తరగతి స్త్రీలను - బొందవచ్చు,
క్రిందువారలు పైవారి - పొందుగోరి
అధమ సంతానమును గాంతు రనియె నతఁడు.

గీ॥ శూద్రుడల బ్రాహ్మణస్త్రీని - శుభము నెంచి
పెండ్లియాడిన చెల్లదు; పృధివి వారు
వర్ణ బాహ్యులు; వారికి ప్రభవమైన
సంతతియె పంచమ కులము - జగతియందు.

మ॥వృ॥ వారొకట స్థలమున - నుండంగరాదు
దేశ సంచారంబు - లేకువఁ జెడియు
సేయుట ధర్మంబు - చిత్తంబు గలుగ
వసియింపనగు వెలివాడలయందు.

మ॥వృ॥ మృత జనంబులమీఁద - నెసగు వస్త్రాలు
తొడుగ నగును; క్రొత్త - దుస్తుల నెపుడు
కట్టఁగాఁ గూడదు - కఠిన దండనము
నను పాలు వడుదురు - హద్దు తొలఁగగ.

మ॥వృ॥ అగ్ర కులమువార - లప్పులొసంగి
నీచ జాతులను ప్ర - శ్నింపంగ రాదు
అన్నంబు వెట్టఁగా - నవసరంబైన
గుంటలలో బెట్టి - పోమ్మనవలయు.

మ॥వృ॥ అక్షర జ్ఞానంబు నతి పాపకరము,
వేద నాదంబుల వినుట - పాతకము,
వెట్టి బాగులవారు - వీరనసతము,
బ్రతుకు సాగింపఁగా - వసుధ ధర్మంబు.

మ॥వృ॥ పక్షణంబులయందుఁ - బవలు బొరాడ
వలయు నేగాని యవసరం బొదవఁగ
రాత్రుల తిరుగాడ రాజ దండనము
మెడమీఁద కత్తియే - మెఱయుచునుండు.

మ॥వృ॥ కుండ పెంకులయందు - కుడువంగవలయు
ఖర శునకంబులు - కలిమి కాదగును
భూషణాల్ మలీమస - భూషణాలగును
కాణాచియగు వల్ల - కాడు సతంబు.

మ॥స్ర॥ అనుచు శాసించిన మనువు - మనుజ ధర్మ
మింత కేనియు నూహించి - యెంచెనేమి ?
మక్కుటము కారణంబుగ - మంచమునకు
వెట్లు వచ్చిన యట్టుల - పీడ దవిలె
భరత ఖండమునకు నెల్ల - భారతీయ.

గీ॥ నరులుగాని వానరులఁ బౌవరము మీఱ
జేరఁదీసిన రఘుపతి - చిత్తశుద్ధి
గలుగు మాలల నిందింప - వలుకఁజెంది
చూడడే యగ్ర కులముల - జట్టుమనుచు.

గీ॥ గుణము కొఱతైన కొలమును - కొఱఁత యగుచు
గుణము లెస్సైన కొలమును - గొప్పదగును ;
గుణముఁ గోల్పడు వారిలో - గొప్పదేమి ?
గుణముఁ గల్గిన మాలల - గుంటదేమి ?

ఉ॥ దైవము సర్వ జీవతతి
దారము పూసలనున్న యట్లుగాఁ
దావలమై చరించునని
తాపస చంద్రుఁడు బుద్ధ దేవుఁడే
భూవలయంబు నంతట సు
బోధలఁజేసె గణింపకే సదా
దేవుని మ్రొక్కుచుందురది
దివ్యము సవ్యమునై చరించునే

గీ॥ భారతావని భారత భాగమైన
గీతకున్నంత కీర్తియే కృతికిఁ గలదు,
దైవ వాక్యమ్ము గీతయై తనరుచుండ
దానిఁ జనువక ధర్మంబుఁ – దాల్చుటున్న.

గీ॥ కులములవి నాల్గు గుణ కర్మ – ములను బట్టి
వెలయఁ జేసితి పంచమ – కులము లేదు
అనెడు శ్రీహరి వాక్యంబు మనమునందు
చింత సేయుట తగుగాదె! శిష్టజనులు.

ఉ॥ గీత సహస్రమెంచుచు వి
కీర్ణ సుబోధ సభాన్వితుండు నై
ఖ్యాతినిఁ గాంచి యిన్వసుధ
గాంధి వచించె సమత్వ భావమున్
మూాతి బిగించుకొందురు స
ముజ్వలమూర్తినిఁ దూలనాడుచున్
నీతికి దూరమై పుడమి
నిర్వృతి నెట్టులగాంతురో యిలన్.

చ॥ కనికరముంచి యాతఁడు ని
గారపు బోధలఁ జాటె నాడు నే
డనుకరణమ్ముఁ జేసి చరి
తార్థులు గామనకున్న నాడటన్

ననటను గుందరేమి ? అను
భాగవత సఖ్యాత నాదిమాంధ్రులన్
దిన దిన కార్యజాలముల
తీర్చియు దిద్దఁగ ధర్మమేగదా !

సీ॥ శాశించె మనువని - శాస్త్రంబు నుడువుచో
మనువున్నగా భువి - మందలింప,
బ్రాహ్మణీక మటంచు - వాక్పాటవము నొడ్డ
బ్రాహ్మణుండున్నగాఁ - బలుక నగును,
ఆచార మడుగంటు - నని ప్రచారము సేయ
నాచార్యుఁడు డున్నగా - నడ్డువెట్ట,
వర్ణసంకరమగు - వారించుమని చెప్ప
వర్ణంబులున్నగాఁ - బలుకఁగూడు

మడగె మనుధర్మ శాస్త్రమ్ము - మంటఁగలిసి
బ్రాహ్మణీకముబోయెను - గ్రామములకు
కాలరథమొక్కటెన్నగాఁ - గదలిపోవఁ
గాలునడ్డంబు వెట్టఁగాఁ - గలరె ధరణి.

గీ॥ అంటరాని తనమ్ము ని - ట్లనుమతించి
యమలు వెట్టుట చూడ మహా క్రమమని
అఖిల దేశస్థులాడఁగ - నాలకించి
బధిర శంఖారవమ్ముగ - బ్రతుక నగునె.

సీ॥ మనుధర్మశాస్త్రమ్ము - మచ్చున కొకండైన
పాటించునే నేడు - పాడియనుచు,
నాల్గు వేదమ్ములు - నలువది కోట్లలో
ననుసరించున! యొకండను వటంచు,
ఉపనిషత్తుల పురాణోక్తమంబుల నేరు
వల్లింప నేర్తురు - పనుల వీడి,
వర్ణాశ్రమంబులు - భావించి మేలంచు
నములు నందుంతురా! యవని జనులు,

అన్నిసూక్తులు గ్రంథాలయందె మిగుల
నేల వాదోప వాదముల్ - పృథివియందు,
సర్వమాన వాభ్యుదయంబు - సంఘటిలగ
సంస్కరించుట పోలదె! - సంఘమిపుడు.

సీ॥ బ్రాహ్మణుండు డేరీతి - భాసిల్లె నధికుండై
విధ్యుక్త ధర్మంబు - వీడిమనుట,
క్షత్రియుండేరీతి - ఘనుఁడనంగాఁజెల్లు
రాజ్యముం గోల్పోయి - ప్రాకులాడ
వైశ్యుఁడేరీతిని వర్తకుండనఁ జెల్లు
వర్తకంబందరు ప్రబలిసేయ,
శూద్రుఁడేరీతిని శూద్ర మానవుఁడయ్యె
శూద్రవృత్తికి పోటి - కోటి సేయ,

అనఁబడది యెట్టులస్వ ప్రస్యో - ద్రై రహించె
నీచ వృత్తుల నెల్లను - నిర్వహింప
ననుచు చింతించి భువిమాన వాభ్యుదయము
గోరకుండిన చెడుదురు - కూళలగుచు.

ఆ॥ వె॥ అన్న విక్రయంబు, ననువుగాని కొలువు
వ ర్తకంబు రాజభటుల పనులు
హాలిక వృత్తులాడు - లనుచితంబైనను
సలుపు భూసురలకు - జాతి కలదె ?

గీ॥ కంచెయే చేనుమేసిన - కంచెఁ బుడమి
పాఱులే ధర్మమొడ బాసి - భ్రష్టులగుదు
శూద్ర జాతుల కథ వేరె చూడవలెన ?
కాలమహిమానుసరణి సంకటము లొదవె.

గీ॥ శాస్త్రసమ్మతముగ మను - జనుఁడు గలడె
లక్షకొక్కఁడు విప్ర - కులంబునందు,
అవని నొక వేళనుండిన - నతని వార
లంత మాత్రాన బ్రహ్మత్వ - మాకళింతు
రనుట ధర్మవైరుధ్యమై - తనరుగాదె.

గీ॥ మ్లేచ్ఛ భాషను నేరిచి - మ్లేచ్ఛులైరి
మ్లేచ్ఛ సేవచే గొందఱు - మ్లేచ్ఛులైరి
మ్లేచ్ఛ దేశంబునకుఁ జని - మ్లేచ్ఛులైరి
మ్లేచ్ఛ వేషంబుఁ జేకొని - మ్లేచ్ఛులైరి.

గీ॥ మ్లేచ్ఛ మయమయ్యె సర్వము మ్లేచ్ఛ పథము
నను సరించుచు నుండుట - ననువుగాని
మాల మాదిగలను నీచ - మానవులని
పాపమున కొడిగట్టుట - భావ్యమగునె.

చ॥ కొలములు నేమముల్విడుట
కూడె మనుస్మృతి ధర్మసూత్రముల్,
జడమతి వానినెంచుట, వి
చారణమాని శనంబు నెత్తియుం
దలమునఁ బెట్టి భూపతి ప
ధమ్మెసకుం గొనిపోయి రాజుగన్
సలిపిన యట్టులుండదె? వి
చక్షణఁ బూనుఁడు మానసంబునన్.

క॥ పౌనరఁగ కంకాళంబై
తనరెడు నాచారతతుల - దవ్వుల నిడకే
మనుచుట వెఱ్ఱి తనమ్మగు
మనవలె కాలమునుబట్టి - మార్పులతోడన్.

సీ॥ కాఫిహోటళ్ళందు - కడజాతులందు రే
తినిపోదు రంతియేఁ - దీరికగను
భోజనశాలల - ముస్లిమ్ములందు రే
ఒక బంతిఁదిని మైత్రి - నుండ్రుగాని,

రైలు ప్రయాణాల - మూలవారందు రే
పైసిఁ బ్రక్కలఁబడి - వర్తుగాని,
తిరునాళ్ళలో క్రిందితరగతులందు రే
మంతనాలాడుచు - మంత్రుగాని,

జాతిమత భేదములనెల్లఁ - జారవిడచి,
విశ్వసోదర భావాన - వెలయువలయు,
కాలచక్రంబులోఁ బుట్టు - గతుల మార్పు
లనుసరింపక యుండిన - ననువుగాదు.

క॥ మతములు, జాతులు, మనుజుల
సతతము భేదాభియోగ - సంహతి నిడుచున్
వెతఁద్రోయుచుండు గావున
సతమే నైక్యానుభూతి - జగతిని మేలౌ.

చ॥ కులమది సింహమై భువి న
కుంఠిత శౌర్య పరాక్రమంబునన్
దెలియని యల్ప మానవులఁ
దేజమడంగ వధించె; కొండటిన్
బలయుతులం బొనర్చి పక్షి
పాటిఁ దొలంగి మెలంగె; నావిధముం
దెలియనియట్లు వర్తిలుచు
ధీజడిమంబునుఁ జూపనొప్పునే.

సీ॥ కులవృత్తి నెపమునఁగొని యగ్రహారాలు
బలిసిరి బ్రాహ్మణుల్ - ప్రబలులగుచు,
కులవృత్తి నెపమునఁ - గువలయ పట్టంబు
నొందిరి క్షత్రియు - లుక్కు మిగిలి,
కులవృత్తి నెపమునఁ - గోమట్లు కోట్లకు
పేరువడసిరి కు - బేరులగుచు,
కులవృత్తి నెపమున - కూలినాలీవృత్తి
వనరిరి శూద్రులు - బలము దొలఁగి,

కులము నెపమున పంచముల్ - కూళలగుచు
పొట్ట మాడ్చికొనిరి కూడు - పుట్టకునికి,
కులము కొందఱి మేలెంచి - కొందఱకును
కీడు నొనరించె కులమది - పీడవలదె.

సీ॥ అంటుకోరాదని - యానవెట్టుటచేత
వ్యాపారము సేయు - ననువుబోయె,
గ్రామాల వెలుపల కాపురంబుంటచే
నభివృద్ధి సూచికా - లసలె పోయె,
పొలములు లేమిచేఁ - బూర్వాను భవముతో
వ్యవసాయ మొనరించు - పటిమబోయె,
ప్రాపంచిక జ్ఞాన - పటలంబు లేమిచే
ముందంజ వేసెడి - పొలువుబోయె,

వెనుకఁబడఁద్రోసి వీరిని - వెకలు లనుచు
హేళనము సేయు చుండఁగా - నేమి మేలు ?
కలుగు భారతావని కెల్ల - ఫలము మిగుల
సర్వమున పాలుగలిగింప - సానుభూతి.

క॥ అవయవ మొక్కటి చెడినను
జవముడుగు శరీరమనుట - సత్యంబగు నో
నవయవము గాదె వారీ
యవనికి ! కడు కీడువడఁగ - నగునే శుభముల్.

గీ॥ అన్నదమ్ములగు మనుజు - లంటరాని
వారలని కడు దూరాన - బారఁద్రోల
చూచి పాశ్చాత్యులనరె వి - శుద్ధమతిని
భారతీయు లనర్హులు - ప్రభుతకనుచు.

గీ॥ మేలు గీళ్ళకు మైత్రితో - మెలఁగువారు,
పస్తువడియుండి పనులకుఁ - బలుకువారు,
కొట్టితిట్టినఁ బ్రేమమై - గొలుచువారు.
కానివారలె హైందవ - గ్రామణులకు.

గీ॥ భూమి జేనెడు లేకయు - పొలమునందు
కూలిపనిఁజేసి జీవించి - క్రుంగిపోయి
యున్నవారలు పంచము - లుర్వియందు,
జతన మొనరింపవలె వారి - స్థితిని మార్చ.

ఉ॥ కూతుదినంగ లేచి కడు
గుందియుఁ గొందలమంది ప్రాణముల్
వీడు సతీ సుతా సుతల -
ప్రీలగ గుండియుగాంచి భర్తయున్
తోడనె కూపమందుఁబడి
తోడ్కొనివచ్చెను మృత్యుదేవతన్
చూడరో ! వానిపీ వసుధ !
జూచియుఁ జూడనియట్టులేగుటో.

సీ॥ సైతోడుగానుండి - శత్రువినాశంబు
నొడఁగూర్పగా జాలు - యుద్ధభటులు,
రాజ్యాంగ తంత్రాలఁ - బ్రావీణ్యమునుజూపి
మహీనేల గల్గెడు - మహిత మతులు
విద్యావిశేషాల - విజ్ఞానమును జూపి
కవితలల్లెడు మేటి - కవికోమాళ్ళు,
సంగీత సాహిత్య - సర్వాంకపత్వంబు
వెలయఁ జేయంగల - విమలమతులు,

ఎన్నగా పంచమకులాల - నెందఱుండ
గలరో తెలియఁగోరిక యున్న - కక్ష్యవీడి
సర్వమున పాలుఁగలిగించి - సమతనెఱపు
కార్యముల సేయఁగావలె - ఘనులు నేఁడు.

గీ॥ చదువనేర్చిన వారెల్ల - సానఁదీరి
నట్టి జాతిరత్నములని - యాత్మనమ్మి
దేశసౌభాగ్య మెననిల్పి - ధీరులగుచు
నంటరానితనమ్మును - గెంటవలయు.

కుకుటుంబులఁ గుక్కలఁ - గూర్చి యింట
జ్ఞానమయులైనవారిని - సరసఁజేర
నీయరది యెంతహేయమో - హృదయమందు
తలచిచూచిన సత్యంబు - తారసిల్లు.

సీ॥ పలుకపలుకన నాత్మ - వత్సర్వభూతాని
యందురే యిపుడేల - ననరుదాని,
అనరె పరోపకా - రార్థం మిదం శరీ
రమ్మని యిపుడు పరాకదేల;
పలుకరే పాపాయ - పరపీడనమ్మని
కరుణతో నిపుడేలఁ గనరు దాని,
అందురే సర్వేజ - నాస్సుఖినోభవం
తని యెందు నిపుడేల - ననరుదాని,

ఆత్మవంచనమును వీడి - యన్నదమ్ము
లగు హరిజనుల పుడమి మేలైనయట్లు
సంతరింపఁగావలయు స - త్సమయమిపుడు
వేచియున్నది వెనుకంజ - వేయనగునె.

సీ॥ గోచిపాతను గైసేసి - తుంతుకలన
బక్కటిలి డొక్కవెన్నంటఁ - బ్రాణములను
చేతనిడికొని మనుగడ - సేయు వీఁడు
సోదరులఁ జూడఁదోపదె? సూనృతంబు.

సీ॥ పస్తుపడి పగలెల్లను - బనులఁజేసి
రాత్రి వేగింప గృహమేని - గ్రామమందు
లేక లేవడియగుచు బ - లీయమైన
రోగముల బారి బడు ననా - రోగ్య మొనసి.

సీ॥ కాలఁజూపినఁ జేతితోఁ - గార్యములను
జేసి రైతు సేద్యమ్మును - వీసమేని
మొక్కబోకుండఁ జూతురు - పొట్టకూటి
కొఱకు నస్పృశ్యులనువారు - కూర్మియెసఁగ.

మ॥ బహుసంతానతతిం భరించి తృటియేన్
బ్రాల్మాలఁబోకుండఁ దా
బహుకష్టంబుల కోర్చి భోజనము సంపా
పాదించు, పై వస్త్రమే
రహిఁ నార్జించునటంచు రైతుమది
తరఁబొందు గావించునే
అహితంబెప్పుడు కాంక్షసేయుటకు న
భ్యాసంబునై యుండగన్

సీ॥ అనని సస్యశ్యామలంబైన పొలములఁ
బనిఁజేసి విహరించి పస్తువడును,
ముప్పూట సఖులకు - భోజనంబిడు రైతు
సేవించి జఠరాగ్ని - చింతవడును,
వస్త్రదానము సేయు - భాగ్యవంతులఁ గొల్చి
చింపిపాతలఁ జుట్టి - సిగ్గువడును
రాత్రింబవళ్ళును - రైతుశ్రేయముఁగోరి
అంతరానినరుఁడై - యార్తివడును,

చదివి సర్వజ్ఞులైనట్టి - చతురమతులు,
సాయపడకున్న దేశమే - శక్తియుడిగి
ఇరుగుబొరుగు రాజ్యాలవాకేవగింప,
జగతి హాస్యాస్పదంబయి - మిగులునకట!

గాంధిదేవుని పలుకులోఁ - గలదు శక్తి,
గాంధిదేవుని క్రియలలోఁ - గలదు రక్తి,
గాంధిదేవుని పూజించి - కలిగి భక్తి,
కార్యముల సేయఁ బూనుచో - కలదు ముక్తి.

*        *        *        *

# మధురోహ

సీ॥ జఠరాగ్ని కీలల - శలభ సామ్యంబుగ
క్రాఁగి సేగినిబడ్డ - జనుఁడొకండు,
రాగరంజిత మనో - రాగాన తపియించి
వలపు తప్తుండైన - వాఁడొకండు,
జిజ్ఞాసలోఁబడి - జీవితంబునురోసి
వైరాగ్య పరిధిలో - వరలు జనుఁడు
పార మెఱుంగక - వారధిలోమున్గి
ప్రాణ భయమ్మున - బ్రతుకు నొకఁడు,

అశనము, ప్రియురాలు, హరి, స - హాయకుండు
లభ్యమైనచో నెట్టి వాల్లభ్యసుఖము,
ననుభవించునో యట్టుల - హరిజనుండు
సంబరపడె స్వరాజ్యంబు చక్కఁబడఁగ.

గీ॥ ఆశ చిగురించి నలుదెస లల్లుకొనఁగ
కరుణ రాజ్యాంగ శాశన కర్తలూని
అంటరాని తనమ్ము వేరంట లాగి
వేసినారల్లు విధులుగావించి నేఁడు.

గీ॥ భావి భారత స్వాతంత్ర్య - పాలనమున
సర్వ మానవాభ్యుదయంబు - జాలువాఱ
నిమ్నజాతుల కొనఁగూడు - నెమ్మదనెడు
మంచి మధురోహ మదినిస్ఫు - రించె నేఁడు

గీ॥ ధర్మ యుద్ధంబుసలిపి రక్తంబుఁగొనక
బ్రిటిషువారిఁ బైకొను మంచి - బిగువులోన
నిమ్నజాతుల శక్తియు నిగ్గుదేరె
విస్మరించుట తగునేమి విశ్వమందు.

గీ॥ మానవతతిలోఁ దలపఁగ - బోనిదొండు
అంటరాని తనంబని - యమలహృదయు
లెఱఁగి యుండుట నిదిమాయు - నింకననుచు
ఆశ రాజ్యాంగ శాశనం - బందు వెలసి
తీవఁదొడఁగె హరిజనుల - భావములను.

గీ॥ కాంచ నుద్యోగహీనులు - కలరు నేఁడు
నూటికిని నూరుమంది యెప్పాట కొఱఁత
దీర్తురో యని హరిజనుల్ - దీనులగుచు
దృష్టి సారించుచున్నారు - ధీరులారా!

గీ॥ 'మమ్ము రక్షించు కాంగ్రెసు; - మాననీయు
లైన నాయకులద్దాని - యధిపులగుట
భయము పడనేమి' - యని వారి - భావమందు
మంజులంబైన యభిలాష మల్లడిఁగొనె.

గీ॥ అమల హృదయులు దేవాల - యములు తెఱచి
హరిజనులు ప్రవేశింపఁగ - ననువు సేఁత
కూర్చె సౌహార్ద భావంబు - కులములందు
వెలసి భక్తిదీనుల చిత్తనియమమందు.

సీ॥ హరిజనోద్ధరణకై - నార్జించి కోటి రూ
ప్యమ్ముల్ కేటాయించు - భావకలిమి,
హరిజనోన్నతిఁ గోరి - యాసవ పానమ్ము
అరికట్టినట్టి మహానుభూతి,
హరిజనాభ్యున్నతి - కై గుడిగోపురాల్
తెరచివేయుండను - ధీరగుణము,
హరిజన శ్రేయమ్ము - నభిలషించుచు గ్రామ
నిర్మాణమును సేయు - నిపుణబుద్ధి

భావి భారత స్వాతంత్ర్య - పాలనమున
అంటరానితనంబు వే - రంటఁజచ్చు
ననెడు మహదాశ వారిలో - నబ్బుఁ జూచె
ఆశ లడుగంటునో జయ - మావహిలునో

మ॥వృ॥ "అస్పృశ్యతా భూత - మార్యవర్షమున
జీవించు కంటె నిర్జీవంబు నగుచు
హైందవ మతమది - యంతంబు గాగ
వాంఛింతు" నని పల్కె - వసుధ నిట్లాడె.

మ॥వృ॥ కర్మ సిద్ధాంతంబు - కతమున జన్మ
నెత్తగా వలయుచో - హృదయంబునందు
భావింతు నే పాకి - వాని గేహమున
పుట్టంగ; బుద్ధిని - భూసురక్షత్రి
యద్విజ శూద్రుల - యవస ధంబులను
పుట్టనెంచ ననుచు - బోధించె గాంధి

మ॥వృ "బ్రాహ్మణులనబడు - వర్ణంబునందు
భవము నెత్తిన నేను - పాకీ కులమున
చేరఁగా భావింతు - చిత్తంబునందు
జన్మకారణముగ - జనుఁ డెవ్వఁడేని
ఆధిక్య న్యూనత - లందుకో లేడు"
అనియె పరమహంస - మనమునందెంచి,

మ॥వృ॥ "అంధ విశ్వాసమై - యవని వహించు
అంటరాని తనంబు - వెంటనే దాని
రూపు మాపఁగ సేయు - రూఢిపథంబుఁ
బూనఁగావలె నింక - బుద్ధిలో నెంచి"

మ॥వృ॥ "లేదు శాస్త్రాధార - లేసంబు దాని
ప్రతిపాదనము సేయ; - పరమేశ్వరాల
య కవాటము లెపుడు - నన్నిజాతులకు
తెఱవబడి యుండును - తెలియుమాబుద్ధి"

మ॥వృ॥ "ఏకవాటము లేని - పృధివి మానవుల
నాటంక పరచిన - నాలయంబందు
దైవంబు లేడని - తలఁచెద"నంచు
లోకమాన్యతిలకు - లోకానజాటె

మ॥వృ॥ "జగతి హిందూమత సంప్రదాయంబు
కాదంట రాదను - కఠినశాసనము
దిక్కుమాలిన వారి - ధీజడిమమున
తలసూపు నొక సంప్రదాయంబు వలన
పుట్టినదంతియే - పోలును విడువ"

మ॥వృ॥ "ఎంత కాలంబిది - యీదేశమందు
అమలునందుండునో - అంతకాలంబు
అభ్యుదయంబను - నదియెల్ల నున్న
తొలగింప వలెదాని - తోయంబువిడిచి"

మ॥వృ॥ “అదియొక యూబిడ్డై - యసువుల బిల్చె
లెక్కకు మించిన - లేకి జనాళి
కబరుదార్ ! జాగ్రత్త ! కనులను విప్పు
మన వివేకానందుఁ డనియె జగాన.”

గీ॥ హైందవావలి శుష్కప్రి - యానలమ్ము
నందు క్రుంగి కృశించిన - ఆదిమాంధ్ర
భూజమేర్చి తలర్చి సంపూర్ణ రూప
మందు కొనునట్లు సేయుదో - యువకులారా !



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 9 | సమ్మతిపైఁ | సమ్మతిమైఁ |
| ,, | 10 | ధర్మమే? | ధర్మమె? |
| ,, | 13 | దాకాంక్ష | నాకాంక్ష |
| ,, | 15 | నస్పృశ్యతా | నస్పృశ్యతా |
| 8 | 8 | లభించె | లిఖించె |
| ,, | 15 | ప్రభవమైన | బ్రభవమైన |
| ,, | 18 | లేఁకువఁ | తేఁకువఁ |
| 9 | 4 | తొలగగ | తొలంగ |
| ,, | 8 | పొమ్మనవలయు | కొమ్మనవలయు |
| 10 | 1 | మ॥ వృ॥ | గీ॥ |
| ,, | 2 | గొంచెనేమి? | మదినినేమి? |
| ,, | 8 | వలుకఁజెంది | నలుకఁజెంది |
| 11 | 16 | యిలన్, | కదా ! |
| 12 | 10 | నాచార్యుఁడు | నాచార్యుఁ |
| ,, | 14 | బోయెకు | బోయెఁగు |
| 15 | 8 | శనంబు | శవంబు |
| ,, | 12 | చక్షణఁ | చారణఁ |
| 16 | 12 | సతమే | సతమె |
| 17 | 14 | వ్యాపారముసేయు | వ్యాపారమునుసేయ |
| 18 | 20 | మార్చ. | మార్ప. |
| 19 | 5 | తోడనె | దోడనె |
| ,, | 17 | పంచమ | బంచమ |

| | | | |
|---|---|---|---|
| 19 | 19 | పాలు | బాలుఁ |
| 20 | 3 | మొననిల్పి | మొదనిల్పి |
| ,, | 8 | తఱచి | దఱచి |
| 21 | 5 | పస్తుపడి | పస్తువడి |
| ,, | 15 | సంపా | సం |
| ,, | 19 | కాంక్ష | గాంక్ష |
| 22 | 1 | అనని | అవని |
| 23 | 7 | వారధిలో | వారిధిలో |
| 24 | 12 | ఆశ | నాశ |
| ,, | 17 | ధీరులారా ! | ధీరులార ! |
| 25 | 4 | వెలసి | వెలసె |
| ,, | ,, | చిత్త నియమమందు | చిత్త నిలయమందు |
| ,, | 7 | పానమ్మ్మ | పానమ్మ్మ |
| ,, | 16 | మావహీలునో | మావహీలునో |
| 26 | 13 | వహించు | రహించు |
| 27 | 1 | లేసంబు | లేశంబు |
| ,, | 16 | నున్న | నున్న |
| 28 | 4 | మన | మని |
| ,, | 8 | సేయొదో | సేయొడో |
| ,, | ,, | యమలులారా ! | యమలులార ! |



## ఆంధ్రప్రదేశ్ హరిజన సేవక్ సంఘముయొక్క

## ప్రచురణలు



1. భంగి
2. చాండాలిక
3. అస్పృశ్యులంటే ఎవరు?
4. అస్పృశ్యతపై వజ్రాయుధము
5. వివేకానందుని దృష్టిలో అస్పృశ్యత
6. కనువిప్పు (బుర్రకథ)
7. పడిపోతున్న అడ్డుగోడలు
8. నీరాజనము
9. కావేరి
10. మానవవిలాపము